శ్రీ ర స్తు.

శ్రీ నందాపురపు రామచంద్రరాజుగారిచే

రచియింపంబడిన

# శ్రీ వేంకటేశ శతకము

సంస్కృతపండితులగు శ్రీ వే- ఇంద్రగంటి

గోపాలశాస్త్రిగారిచేతను

ఆంధ్రగీర్వాణపండితులగు శ్రీ వే- దూర్వా

సుల మీనయ్యశాస్త్రిగారిచేతను

పరిష్కరింపఁబడి-

ప్రకటింపంబడియె.

Printed by V. Bhavanisankarasastri.

1879. Arsha Press. Vizagapatam.



శ్రీరస్తు.

శ్రీ

# వెంకటేశ శతకము.



శ్రీకరగుణజాల చిరకృపావనశీల పాకా
రిసుతలోలభక్తపాల, కాకోదరశయానఖగకు
లపతియాన నిఖిలలోక నిధాననిరుపమాన, స
కలజనాధార సజ్జనమందార జగదేకవీరమో
నిగమసార, వికసితోత్పలనేత్రప్రకటిత చారిత్ర
సుకవినుతిపాత్ర శుభచరిత్ర, దేవ శ్రీకృష్ణభూ
పాలదేవిమైన, నీలమణిదేవిఁగృపతోడ నేలుమి
పుడు, మత్స్యపురవాస విశ్వేశమంజుభాష విను
తమంగాంగనాధీశ వెంకటేశ- ౧.

నీటఁబొంచివిరోధినీల్గ జేసినమారు తరికొండ
మూపునదాల్చితప్పు, ఘోణివై స్వర్ణాక్షుగూ
ల్చితివనురట్టు సంకరాకారుడన్ జనులవాదు,
పాఱుగుజ్జుండవై బలిని వేడినసడి కృపమానినృప

తులఁగూల్చు నింద, సఖునివిల్ విరచినసాహసివ నుమాట మేరుప్రయ్యాగ జేయుకార్యానుడువు, నెరి ప్రబుద్ధుడవనునట్టి పరుసదనము కలికివైయుంటివనునట్టిచులకదనము, మాన్పుకొనగోరి శేషాద్రినునికిమీకు వినుతమంగాంగనాధీశ వెం- ౨.

మద్గురుడకలంకమంత్రిప్రగడవంశకలశవార్ధిసుధాకరుఁడనఘుఁడు, వాదిభయంకరవరబిరుదాంకుండు సర్వశాస్త్రార్థవిశారదుండు, నమరగురుండనసమాన శేముషీఘనుడు ప్రకాశస్వత వివరునకు, నతులొనరించినీశతకంబొనర్చెదసితకరరవినేత్రచిత్తగింపు, దేవశ్రీకృష్ణభూపాలుదేవివైననీలమణిదేవి కృపతోడనేలుమెపుడుమత్స్యపురవాస విశ్వేశ మంజుభాష వినుతమంగాంగనాధీశ వేంకటేశ- ౩.

హారకిరీటకేయూరకుండలరుచుల్ చెక్కుటద్దముల పైఁజిందులాడ, రతనాలసరులతోరహిగులుకుచిలుకులతాళీలురంబునఁదాండవింప, బలభిన్మణిస్తంభముల నీటుగలమేటి భుజముల కేయూరములుచెలంగ, నీలాభ్రరుచినింపు నిజతనుద్యుతిసొంపు నై పథ్యదీప్తివిన్నాణమమర, నలరునివ్నెన్నజునకు నలవియగునె దేవ శ్రీకృష్ణ

భూపాలు దేవివైన నీలమణిదేవికృపతోడ నే లు మెపుడు వినుతమంగాంగనాధీశ వెంకటేశ -

సుమబాణజనకసంయమిహృత్కమలమిత్రసు మనఃకదంబసంస్తుతచరిత్ర, సూరిజనస్తోత్రసుక విపినుతపాత్రసారసదళనేత్ర సమదజైత్ర, ఫణి రాజతల్పసన్మణిమయసుకలాప గుణమణిసం ఘాతగోత్రనేత, కరిరాజవరద శ్రీహరిపరేశ శ రణ్య సురపతినుతపరసరసహృదయ, దేవశ్రీకృ ష్ణభూపాలు దేవివైననీలమణిదేవిఁగృపతోడ నే లు మెపుడు మత్స్యపురవాస విశ్వేశమంజుభాష వినుతమంగాంగనాధీశ వెంకటేశ- ౪.

నీముఖాబ్జమరీచి నిర్గమనస్ఫూర్తి భక్తచకోర కభాగ్యరాశి, నీసుదర్శనలసన్నీలజీమూతంబు దాసచాతకమనస్తాపశమము, నీవాక్సుధాధా రనిజభృత్యజనలోక తాపత్రయాభీలదర్పహర ము, భవదీయనామాంకభరితసద్వర్ణముల్ ప ఠనశీలురభవబంధహరము, దేవశ్రీకృష్ణభూపా లుదేవివైన నీలమణిదేవిఁగృపతోడనే నేలు మె పుడుమత్స్యపురవాసవిశ్వేశమంజుభాష వినుత మంగాంగనాధీశ వెంకటేశ- ౫.

ఎవ్వనిపదములకీనమండలపురుషుల్ నూపు

రప్రభలునై యేపుచూపు, ఎవ్వనిపదపద్మ మివ్వసుంధరయందుబలిశిరోరత్నమై ప్రణుతిగాంచె, నెవ్వనిపదతలమిందుశేఖరుమౌళిబొలుచుభాగీరథిపుట్టినిల్లు, ఎవ్వనిపదరజ మిందార్యమలరుదందరాతినాతిని జేసి రమణ నెసగె నట్టినిన్నెన్నన హిపతికై నవశమె, దేవ శ్రీకృష్ణభూవరుదేవివైన నీలమణిదేవిఁగృపతోడ నేలుమెపుడుమత్స్యపురవాసవిశ్వేశమంజుభాష వినుతమంగాంగనాధీశ వెంకటేశ- ౭.

అంబురుడ్భవదిగీశార్చితపదకంజదంభోళిధరశత్రుదర్పదళన, గాంభీర్యజితవార్ధికాళియనాగారిబంభరచికురదుర్భరశరజిత,కుంభికుంభవిదారిఘోరరంగనతారి శంబరాసురరిపుజనకశౌరి, శుంభద్విహారసత్సుగుణగణాధారమేరుభూధరధీరమిత్రతేజ, దేవ శ్రీకృష్ణభూవరుదేవివైన నీలమణిదేవిఁగృపతోడ నేలుమెపుడు మత్స్యపురవాస విశ్వేశమంజుభాష వినుతమంగాంగనాధీశ వెంకటేశ- ౮.

భక్తప్రియకృపాబ్ధిపాలిత బ్రహ్మాండ జయరమారమణీశశార్ఙ్గహస్త, ముక్తిప్రదసుపర్వమునిజనమందారతాపత్రయవిదూర పాపహర

ణ,రవిశశిలోచనసవనభుక్పతినుతయవనమురా
న్తకయాదిదేవ, శరనిధికన్యకావరయరిదరకర
శరణాగతతార్తిణవరధురీణ, దేవశ్రీకృష్ణభూవరు
దేవిదైన నీలమణిదేవిఁగృపతోడనేలుమెపుడు
మత్స్యపురవాసవిశ్వేశమంజుభాష వినుతమం
గాంగనాధీశ వెంకటేశ- ౯.

మకరితోఁబోరనోపకడస్సి శరణన్నకరికులేం
ద్రునిప్రేమగాచినావు, వరదరమేశ శ్రీహరిగా
వుమని వేఁడుపాంచాలిబన్నంబుబాపినావు, అ
తఃపురద్రోహియగురావణానుజుమన్ననచేపట్టి
మనిచినావు, మువ్వంకగల గుజ్జుముదితను కరు
ణించి చేడెలకన్నాకుజేసినావు, యిట్టినీతోడస
రిదైవమెందుగలడు దేవశ్రీకృష్ణభూవరుదేవిదై
ననీలమణిదేవిఁగృపతోఁడ నేలుమెపుడు వినుత
మంగాంగనాధీశ వెంకటేశ-౧౦.

కమలాబ్జముఖమనఃకైరవసితకర, జాంబవతీ
ముఖజలజమిత్ర, సత్యాంగనామనశ్చాతకపర్జ
న్యలక్ష్మణాక్షిచకోరరాజకిరణ, రవిసుతాకుచ
గిరిరమ్యఘనాఘనా భద్రయావన వనభావజాస
ఖ, మిత్రవిందవపుశ్చిత్రభూషణమణి, వరసు
దంతాచూతవరతరుపిక, దేవశ్రీకృష్ణభూవరుదే

విన్నైననీలమణీదేవిఁగృపతోఁడ నేలు మెపుడుమ త్స్యపురవాస విశ్వేశ మంజుభాషవినుతమంగా ఙ్గనాధీశ వెంకటేశ- ౧౧.

నిగమముల్ గొనివారినిధినిసోమకుఁడు డాగినవిధినినుగనుగొనిశరణ్యా, కరుణించుమనుధాతగనుగొనిమన్నించి సురమునివరులకచ్చెరువుగాఁగ,శకులస్వరూపసంజనితమహామూర్తి నై కొనిరిపుని బల్ గండడంచి, కరముసుపర్వసంఘము లెన్న శ్రుతులు వేవిధికిచ్చినట్టిసద్వినుతచరితదేవశ్రీకృష్ణభూవరు దేవిన్నైన నీలమణీదేవిఁగృపతోఁడ నేలు మెపుడు మత్స్యపురవాస విశ్వేశ మంజుభాషవినుతమంగాంగనాధీశ వెం- ౧౨.

అమృతసంభవయత్నులై సురాసురులుమందరమబ్ధిలోనిడిదరుచు నెడల, కడుభారమున నద్రికడలిమున్గినగనివరదదయాపరవాసుదేవ, రక్షించుమనుసురరాజిపైకరుణించి తా మేటిరూపంబుదగధరించి, సరభసంబుగను దద్గిరికి నాధారమైయమృతజీవులఁజేసితమరవరులదేవశ్రీకృష్ణభూవరు దేవిన్నైన నీలమణీదేవిఁగృపతోఁడ నేలు మెపుడు మత్స్యపురవాసవిశ్వేశమంజుభాషవిన్నుతమంగాంగనాధీశ వెంకటేశ- ౧౩.

స్వర్ణాక్షుఁడనుసుధాశనరిపుఁడత్యంతగర్వియై సర్వదిక్పపతివరుల నోడించిమించి, భూయువతి లలామంబుగొనిరసాతలమున నొనరనునుచత దృూతిరునివధింపఁదగయజ్ఞఘోణివై దురముననఁ బరిమార్చి వెలవుమీర,శృంగాగ్రమునధరిత్ర్యం గనగొని తెచ్చితొంటియట్లుంచిన దోర్బలాఢ్య దేవశ్రీకృష్ణభూవరుదేవివైన నీలమణీదేవిఁగృప తోడనేలుమెపుడు మత్స్యపురవాస విశ్వేశమం జుభాషవినుతమంగాంగనాధీశ వెంకటేశ-౧౮

కృపమానిస్వర్ణకశిపుడనునిశిచరుడమిత బలప్రౌఢినతిశయిల్లి, భక్తాగ్రగణ్యునిబాలునికో పించిహరినిందుఁజూపురాయ నిచరచిననరసిం హమూర్తివై యురుకంబమునఁబుట్టినెట్టన త దూత్రిరుగిట్టి పట్టిచంపి ప్లప్లాదుని సదయుడై రక్షించిమునులనుదివిజుల మనిచినట్టి,దేవశ్రీకృష్ణ భూవరుదేవివైన నీలమణీదేవిఁగృపతోఁడనేలు మెపుడు మత్స్యపురవాస విశ్వేశమంజుభాషవి నుతమంగాంగనాధీశ వెంకటేశ- ౧౫.

అమరహితార్థివైయదితికశ్యపులకుఁబుట్టి వామనమైన మూర్తిదనరి, త్రిదివసామ్రాజ్యం బుదేవతానేతకునాఁటలనిచ్చుటకునై మదిదలం

చ, వితరణగుణసమన్వితుఁడగుబలిగనియొకటి
రెండడుగులువసుధ వేఁడి, సకలలోకములు త
త్సంధులు నీవయై యగ్రజునకుఁబ్రియమమరజే
యుదేవశ్రీకృష్ణభూవరుదేవివైన నీలమణీదేవిఁ
గృపతోడ నేలుమెపుడు మత్స్యపురవాసవిశ్వేశ
మంజుభాషవినుతమంగాంగనాధీశ వెంకటేశ.
భృగుకులజలరాశివిధుఁడవై జనియించియస్త్రవి
ద్యకుమేటివనఁగనెగడి, సర్వధరిత్రినిఃక్షత్రంబు
గానిర్వదొకమారు నృపతులనుక్రిండంచి, క్రౌ
ఞ్చాచలవిభేదకరకాండచండిమగలధనుర్ధరు
డనుఘనతఁగాంచి,కరగతయగుభూమికాంతకు
కాశ్యపియనునామము ఘటించి యలరజేయు
దేవశ్రీకృష్ణభూవరుదేవివైననీలమణీదేవిఁగృప
తోడనేలుమెపుడు మత్స్యపురవాసవిశ్వేశమం
జుభాషవినుతమంగాంగనాధీశ వెంకటేశ.౧౭.
సర్వసర్వంసహాచక్రపాలనరతిదశరథసూను
డై తగజనించి,సవనరక్షణకు విశ్వామిత్రుతోఁజ
నితాటకయనుదైత్యతరుణిజంపి,తత్సంయమీం
ద్రుచేతను మేటిశస్త్రాస్త్రవిద్యారహస్య సద్వి
ధులెఱింగి, జనకునిపురినితత్సయ్యఖిుతో నేగి సీ
తాపివాహసంసిద్ధినొంది భూసుతనుగూడి సా

కేతపురినిచెలగు, దేవశ్రీకృష్ణభూవరుదేవిరైన
నీలమణీదేవిఁగృపతోడనేలుమెపుడు వినుతమఁం
గాంగనాధీశ వెంకటేశ- ౧౮.

ధరనుసజ్జనచిత్తతామరసవికాసకర మోహనా
కారకాంతిగల్గు, వాఁడౌటరాముఁడవార్యపరా
క్రమబల్మిగల్గుటజేసి బలుఁడవనియు, విలసిల్లిము
ష్టికుపీరుఁబ్రలంబునిగిట్టిపట్టివధించుచుఘట్టితనము
గల్గి రేవతియనుకాంతకు ప్రియుఁడవై వెలసినట్టి
బలుండవీవెకావె, దేవశ్రీకృష్ణభూవరుదేవిరైన
నీలమణీదేవిఁగృపతోడ నేలుమెపుడుమత్స్యపుర
వాసవిశ్వేశ మంజుభాష వినుతమంగాంగనా
ధీశ వెంకటేశ- ౧౯.

పాత్రిగ్రిశాంగనకు సత్ప్రభువతంసంబనతన
రదేవకిగర్భముననుబుట్టి- నందసతీలసన్మందిర
వాసివై విషకుచయగుదైత్యవెలదిజంపి - వల్లవ
వికచాబ్జవదనలిళ్లకునేగివరనవనీతతస్కరత వెల
సి- భువనమోహనకరమురళీరవంబు నజనపరం
పరకు నుత్సవమొనర్చు-దేవశ్రీకృష్ణభూవరుదేవి
రైనవనీలమణీదేవిఁగృపతోడనేలుమెపుడుమత్స్య
పురవాసవిశ్వేశమంజుభాష వినుతమంగాంగ
నాధీశ వెంకటేశ- ౨౦.

త్రిపురదానవసతీతిలకంబులనువిష్ణు శితసా
యకములచేస్రుక్కఁజేసి- తద్వరతతికిన్నెదగశర
మూర్తివై కూల్చిసయ్యామిసురకోటిచేతఁ, బొగ
డుగాంచిమహావిభూతిబుద్ధతనొంది- పూర్వా
మరవిశిష్టపూజగాంచి-సర్వభూతసమత్వమూర్తి
భవత్ప్రసాదంబున వెలయించుధన్యచరిత - దేవ
శ్రీకృష్ణభూవరుదేవిమైననీలమణిదేవిఁగృపతో
డ నేలుమెపుడు మత్స్యపురవాస విశ్వేశమంజు
భాషవినుతమంగాంగనాధీశ వెంకటేశ - ౨౧.

ప్రబలమహాపాపపంచకంబునడంగద్రొ
క్కించుటకొనాగతోరమైన, పంచధారావాప్తి
నంచితపారసీకార్వంబుపైనెక్కి యమితమహి
మ, యవనహూణకిరాతులమితదుర్వర్తులతర
వారిధారలనురుముచేసి, వర్ణాశ్రమాదిసద్వర్త
నల్ ధరణిపై వెలయింపజేసినకలికివీవె, దేవశ్రీ
కృష్ణభూవరుదేవిమైన నీలమణిదేవిఁ గృపతోడ
నేలుమెపుడు మత్స్యపురవాస- ౨౨.

శరదిందుచంద్రికాస్ఫురితనిశీథినీవేళబృందా
రణ్యవీథియందు, యమునానదీతీరసుమసౌరభో
జ్జ్వలచంపకకురవకచ్ఛాయమందు, వేణుకలస్వ
నవిపులగానంబునగోపవధూజనకోటినెల్ల, చెలి

మిచేఁద్వదధీనచిత్తముల్ గలవారిగాఁ జేసి మను
పవే కరుణతోడ, దేవ శ్రీకృష్ణభూవరు దేవివైన నీ
లమణిదేవిఁగృపతోడ నేలు మెపుడు మత్స్యపుర
వాస- ౨౩.

నాగరాట్పర్యంకశాయి నదేవమిందోహాకాళి
యనాగారిఖలవిదారి, పాకారినుతలోల భక్త
పాలనశీల కాకోదరశయాన గరుడయాన, చా
మీకరసుచేలసయ్యామిపరిపాల, ధారుణీధరధీ
రదళితవీర,రక్షితవేదండరణజయకరకాండనిర్మ
లపాదాబ్జనిగమవేద్య- దేవశ్రీకృష్ణభూవరు దే
విద్వైన నీలమణిదేవిఁగృపతోడ నేలుమెపుడు
మత్స్యపురవాస. ౨౪.

కరుణాకరశరణ్య కంజనేత్రపరేశమురని
షూదనకృష్ణముంజకేశ, సురమునినుతపదసరసి
జకేశవ కరిరాజవరద శ్రీకరశుభాంగ, వరదర
క్షకశౌరివాసుదేవముకుంద నరహరివామననర
కదమన, పరమదయానిధీపద్మనాభ పురాణపు
రుషమాధవచక్రిభోగితల్ప, దేవశ్రీకృష్ణభూవరు
దేవివైన నీలమణిదేవిఁగృపతోడ నేలుమెపుడు
మత్స్యపురవాస విశ్వేశమంజుభాష. ౨౫.

నారాయణాచ్యుతనగధరవైకుంఠవాసదా

మోదరవాసవిసఖ-గరుడకేతనవిష్ణుకాంచనా
మ్బరధరశార్ఙ్గజనార్దనశకటదైత్య-హారణప
రాత్పరపురుషోత్తమవినీలనీరదనిభదేహనిగమ
వంద్య, కందర్పశతకోటిసుందరగంధేభహారబ
లగోవిందయాదిదేవ - దేవశ్రీకృష్ణభూవరుదే
విమైన నీలమణిదేవిఁగృపతోడనేలుమెపుడుమ
త్స్యపురవాస. ౨౮.

సనకాదిమునిమనస్సరసిజదినమణి మనసిజ
శతకోటిమంగళాంగ,జనకజాముఖనవజలజచం
ద్రోదయవనజదళేక్షణ వాలిహరణ, యినసు
తాంగదనీలపనస జాంబవదాదివనచరభటకృత
వారిరాశి,బంధనరిపువీరపంక్తిముఖాసుర ఖండ
నరఘువీరకరుణతోడ,దేవశ్రీకృష్ణభూవరుదేవి
మైన నీలమణిదేవిఁగృపతోడ నేలుమెపుడు మ
త్స్యపురవాస. ౨౯.

రఘుకులార్ణవసోమరామనీనామసామర్థ్య
మెంతనికొనియాడవచ్చు , భవదీయకృపను స
త్పాత్రులౌ సాకేతపురవాసులకె నీదుపురనివా
స, మొసగికటాక్షించితుర్వియందరకునుదలచి
నమాత్రనెదయనుముక్తి,గలిగించిబ్రోచు నీఘన
నామమదిగాన నుహిమకు హెచ్చమ్యె మాన్య

చరిత, దేవ శ్రీకృష్ణభూవరుదేవివైనసీలమణిదేవి కృపతోడ నేలుమెపుడుమత్స్యపురవాస- ౨౮.

అబ్జగర్భసురేశ్వరాదిదివ్యకిరీటరత్నప్రభా భాసురంబులైన, భవదీయపదనూత్నపల్లవతల్ల జద్వయముమనంబున దనరుభక్తి, నెవ్వఁడుదా ల్చునోయిందిరేశయతండు భవదీయ కృపకు స త్పాత్రుఁడగుచు, నీషణత్రయమహాభీషణ జ లరాశి మునుఁగక దరిజేరుమురవిభేది, దేవ శ్రీ కృష్ణభూవరుదేవివైన- ౨౯.

కిసలయోత్ఫుల్లసత్ప్రసవపుంజంబన పదము లనఖరాజిపరిఢవిల్ల, కటకకేదారోద్ధకలమగర్భ ములన జంఘలనవకాంతిచౌకళింప, కటిసైకతో జ్జ్వలకదళికాతరులన నూరులనునుకాంతు లూర పు నెరప, తల్లియశోదముందరనందమగునీదు చి రుతప్రాయంబునకరముముద్దు, గులుకునడకల చూయ యెన్నగొనగదరమె, దేవ శ్రీకృష్ణభూవ రుదేవివైన- ౩౦.

భూరికృపాపూరపుణ్యజనాధార మారశో రాకారహారహీర, చందనమందార శరదిందు ఘనసారకుందకాశకలసత్కుముదక్షీర, పార దనీహార భాసురాబ్జమరాళసత్కీర్తి విస్తార స

మరవీర, భక్తజనాధారభవరోగభయదూర శక్తిధరస్తుతశౌర్యసార, దేవశ్రీకృష్ణభూవరుదేవి హైన- ౩౧.

అమరారిజయసుపర్వార్చితాంఘ్రిద్వయ కమలావధూమనఃకైరవాబ్జ, సమరావనీజితశత్రుపరాక్రమకమనీయమృదుపీతకాంతిచేల,యమనియమాష్టాంగ హరియోగసుధ్యేయ శమదమాన్వితతపస్సాధనీయ,కామారినుతలోలకభ్రమకాంతికపోలసామగానప్రియ శ్యామలాంగ, దేవశ్రీకృష్ణభూవరుదేవిహైన- ౩౨.

స్మరహరశరమహాపురుషపన్నగతల్పహరిపరాక్రమభూరియఘవినాశ, కుందసుమప్రభాంకురకరదరహాస భాసురజగదేకభవ్యచరిత, విశ్వమయత్వసంవేద్యవిదూరపక శాశ్వతానందప్రసన్నదాయి, సప్తతంతుఫలప్రసాదసాదరభక్తిపూజితభక్తహృత్పద్మభృంగ, దేవశ్రీకృష్ణభూవరుదేవిహైన- ౩౩.

దోషశుష్కారణ్యదుర్వారదవశిఖిభీషణదైత్యాద్రిభిదురపాణి, రోషఖలాభీలరుగ్రసాయనవరభాషాధిపస్తుతపాదపద్మ,యోషాజనమనోజవేషాలసద్రత్నభూషామణిస్ఫీతభోగితల్ప,పో

షితామరమానిపుంగవవిశ్వేశదోషాచర విఖండదోఃప్రచండ, దేవశ్రీకృష్ణభూవరుదేవిన్నైన-
కందర్పశతకోటిసుందరాంగసురేంద్రవందనీయుపదారవిందయుగళ, గంధాంధసింధురఖండనదృఢబల కంధిగర్వవినాశకరణ శౌర్య, కుందారవింద రాకేందుముఖాస్వాద్యశ నందనందనయనునలినచంద్ర, యిందిందిరాలకబృందముఖాంబుజఫుల్లరాజీవప్రఫుల్లనయన, దేవశ్రీకృష్ణభూవరుదేవిన్నైన- ౩౫.

రఘుకులజలరాశిరాకాసుధాకరమఘురక్షణచరిత్రమంజుగాత్ర, సుగుణగణనిధానసగుణనిర్గుణరూపనిగమవందితమహనీయతేజ, నగచరసైన్యాధినాథమనోభీష్టదాయి వాలిమహోగ్రదర్పహరణ, ఖగపతిమోక్షణకరవిచక్షణదశయగణితాసురబలాధ్యక్షహరణ, దేవశ్రీకృష్ణభూవరుదేవిన్నైన- ౩౬.

నెమ్మదితోనినునమ్మిసేవించినదాసచాతకనీరదంబనంగ, కడుభక్తినినుపూజగావించుజనులకు నిష్టదాయకకల్పవృక్షమనంగ, క్షణమాత్రమీపదస్మరణజేసె ననరుకిల్బిషకానన కీలివనంగ, నీకథాకర్ణననిపుణులౌమనుజుల విపదంధతమ

సోగ్రతపనుఁడనఁగ, వెలసియున్నట్టినీకృప కేది
మేర, దేవశ్రీకృష్ణభూవరుదేవివైౖన- ౩౭.

సురమునివందిత శరణురమాధీశ పరమద
యానిధీపద్మనాభ యనినీదునామంబు లనుది
నంబుపఠించు భక్తాగ్రగణ్యులౌ భాగవతుల, పద
రేణువులు సదా ముదమున నెవ్వండు శిరమున
దాల్చునో కరముభక్తి, నతఁడు కాలకరోరహ
తులనందకమహామతియనఁదగి నిను మరువఁడె
పుడు, దేవ శ్రీకృష్ణభూవరుదేవివైౖన - ౩౮.

ఎవ్వనిసోయగంబిందిరాసుందరిమానధనం
బెల్లఫూనికొనిమె, ఎవ్వనిసామర్థ్యమింద్రుని నో
డించి సత్యభామకుపారిజాతమిచ్చె, నెవ్వనిప
దరజంబెలమి పాషాణంబు రామామణిని జేసిర
హినెసంగె, ఎవ్వనిచారిత్రమింపుతోవినువారి
పాతకసంఘముల్ పారఁదోలు, నట్టినిన్నెరిక
నుతింపనలవియగునె, దేవశ్రీకృష్ణభూవరుదేవి
వైౖన- ౩౯.

శంఖచక్రగదాసిశార్ఙ్గసనాథశ్రీకరముని
మందారశరణుశరణు, సులలితజలజాతదళసు
లోచనదీప్తివరలు శ్యామలదేహ శరణుశరణు,
హరిసురేశార్చితయంఘ్రిద్వయ పరేశపరమద

యాంబుధీశరణుశరణు, మురనరకాది భీకరరిపు
సంహారకకరిరాజవరదయోంశరణుశరణు, దేవశ్రీ
కృష్ణభూవరుదేవిద్వైన, నీలమణిదేవిఁగృపతోడ
నేలుమెపుడు మత్స్యపురవాస - ౪౦.

కమలదళేక్షణయమరారిజయలసత్సదమల
గుణజాల శరణుశరణు, హారహీరతుషార శా
రదచంద్రికా సారకీర్తివిహారశరణుశరణు, కృ
ష్ణమాధవశౌరి కేశవవనమాలి చంద్రశేఖర మి
త్రశరణుశరణు, పద్మనాభముకుంద పాహిం జ
నార్దన జనకజాహృదయేశ శరణుశరణు, దే
వ శ్రీకృష్ణభూవరు దేవిద్వైన నీలమణిదేవిఁ గృప
తోడ నేలుమెపుడు మత్స్యపురవాస - ౪౧.

ఖరకరవంశ నీఘననామముపఠింప జ్వరపరి
తాపసర్పాదికములు, భూతభేతాళసంఘాతా
దిభయములు దొలగకనిలుచునే దురితహరణ,
నిగమముల్ నీదివ్యసుగుణరాశుల నెన్న నేరవ
న్నను నేర్చునిపుణిగలఁడె, భక్తమందార భవ
రోగభయవిదూర దివిజరిపుశిక్షగురువక్షదీనర
క్ష, దేవ శ్రీకృష్ణభూవరుదేవిద్వైన నీలమణిదే
విఁ గృపతోడ నేలుమెపుడు మత్స్యపురవాస-

మామానినీమానమానితార్ణవగంభరూప

మందరముదఌకోపరాత్ప , రాపత్ప్రయోధిసం
గ్నార్యజనావనప్లవసవనాశనప్రభువతంస, మ
కుటాగ్రమణిలసత్ప్రకటప్రభాజాలనీరాజితప
దాబ్జనిగమవేద్య , శుకముఖద్విజనుతసురుచిర
గుణజాల యకుటిలభక్తార్తిహరణశీల, దేవశ్రీ
కృష్ణభూవరుదేవిమైన నీలమణిదేవిఁగృపతోడ
నేలుమెపుడు మత్స్యపురవాస - ౭౩.

పాతకులైనను భవదీయకృపకు సత్పాత్రు
లౌదురుగదా భక్తివలన , పాషాణమకలంక
భామినీమణియయ్యె శత్రుజాతికిరాజ్యజయము
గల్గె , కపిజాతికత్యంత గౌరవంబుఘటించె చె
నటిజాతికినిశ్రేయమబ్బె , యఘటనఘటనా
విహారహారివినీకునెంచిచూడ నసాధ్యమెందుగ
లదు , దేవశ్రీకృష్ణభూవరుదేవిమైన నీలమణి
దేవిఁగృపతోడనేలుమెపుడు మత్స్యపురవాస-

నీలభూధరధామ నిజఌరనుతనామ కారు
ణ్యరససీమఖలవిరామ , రఘుకులార్ణవసోమ
రాజితగుణధామ నిర్జితభృగురామ నృపలలా
మ , తులసికాదళదామ విలసితవ్రతకామ వీర
శాత్రవభీమ విజయధామ , యిందీవర శ్యామ
కుందసూనసురాళసందోహజద్యశస్సావఌధా

ను, దేవశ్రీకృష్ణభూవరుదేవివైన నీలమణిదే
విఁగృపతోడ నేలు మెపుడుమత్స్యపురవాస,౪౫
జోహారుశతకోటిసూర్యసన్నిభ తేజ వంద
నంబకలంక నందకధర, దండముద్దండ వేదండ
రక్షణదక్ష నతులానర్చదమాహాన్నతప్రతా
ప, కేలు మోడ్పులానర్సు వ్యాళేంద్రిశనుతల్ప
జేజేలానతుర్నిజిర్తబలారి, మొక్కెర్దసన
కాదిమునిలోకపూజితజొంత జే సెదరమాకాం
తనీకు, దేవ శ్రీకృష్ణభూవరుదేపివైన నీలమణి
దేవిఁగృపతోడ నేలు మెపుడు మత్స్యపురవాస-
దండంబు కోటికందర్పసుందరరూప దం
డంబునరకాదిదైత్యదళన, దండంబు కౌంతేయ
తరుణియాపద్రక్ష దండంబుత్రిజగతీధవశరణ్య,
దండంబు గోపికాతరుణీమనోహర దండంబు
నిగమసంస్తవచరిత్ర, దండంబుభూసుర తన్వి
దత్తసుభోజ్య దండంబు కుండలీధవసుతల్ప, దే
వశ్రీకృష్ణభూవరుదేవివైన నీలమణిదేవిఁగృప
తోడ నేలు మెపుడు మత్స్యపురవాస - ౪౬.
శరణాగతాభయజనపరాయణదక్షమాన్య
యాద్రౌపదిమానరక్ష, దక్షశిక్షణధనుర్దండ
ఖండనదీక్ష చక్షుశ్రవస్తల్ప శయనదక్ష, శ్రీ

వత్స లాంఛనాంచితలసద్గురువక్షు కరుణారసో జ్జ్వలఘనకటాక్షు, నీలనీరదమహనీయసుందర దేహనాగేశకమనీయనవ్యబాహ, దేవ శ్రీకృ ష్ణభూవరుదేవిదైన నీలమణిదేవిఁగృపతోడ నే లు మెపుడు మత్స్యపురవాస - ౪౮.

కామితమందారకమనీయమణిహారకోమల ద్యుతిసార కుధరధీర, సూరిజనాధారభూరికృ పాసార వీరారిజయశౌర్యసూరవర్య, నారద నుతపాత్ర నగజాధవస్తోత్రవనజాలయకళత్ర వ రచరిత్ర, చంద్రసూర్యసునేత్ర సుందరోజ్జ్వల గాత్ర సూనబాణసుపుత్రసుజనమిత్ర, దేవశ్రీ కృష్ణభూవరుదేవిదైన నీలమణిదేవిఁగృపతోడ నేలు మెపుడు మత్స్యపురవాస - ౪౯.

వారిజభవశచీవల్లభులాదిగాదేవతలేదేవుది వ్యలీల, లెరిఁగినుతింపలేరిట్టివట్టివటంచునట్టిదే వునిజగదార్తిహరణు, నాగమవేద్యునినవద్యు నద్వంద్వునప్రమేయుననంతుసుప్రకాశు,నురుద యాఢ్యుని జగదుత్పత్తిస్థితిలయములకు నాధా రమైవెలయునిన్ను, నాశ్రయింతు జగత్ప్రభూ యనుదినంబు, దేవ శ్రీకృష్ణభూవరుదేవిదైన నీలమణిదేవిఁగృపతోడనేలు మెపుడు మత్స్యపు-

బలివిభీషణశుక ప్రహ్లాదనారదయతివరకుబ్జాంగదాంబరీష, ఖట్వాంగశిబిశౌనక పరాశరాత్మజుల్ గుహశబరీధ్రువ కుంజరేశ, విదురభీష్మకుచేల విజయోద్ధవాదులు భక్తాగ్రగణ్యులౌ భాగవతులు, నీదు పదధ్యాననిపుణులుగావున దలచి వేడెదవారిదైవరాయ, దేవ శ్రీకృష్ణ భూవరుదేవిద్వైన నీలమణిదేవిఁగ్రృపతోడ నేలుమెపుడు మత్స్యపురవాస - ౫౧.

ఇందీవరశ్యామ మందారసుమదామ వందారుసుతనామ వైరిభీమ, చందనకుందరాకేందుభాస్వత్కీర్తిసందోహధవళితాజాండభాండ, మంథాద్రిధరశత్రు గంధేభజయుబల నందనందన యమునాశనకర, ఇందిందిరకచారవిందసుందరనేత్ర కంసపటమోహనాకారరూప, దేవ శ్రీకృష్ణభూవరుదేవిద్వైన నీలమణిదేవిఁగ్రృపతోడ నేలుమెపుడు మత్స్యపురవాస - ౫౨.

అక్రూరవరదక్రీహారి వరాహ్వరఘునాఘుననీలదేహ శ్రీకంఠమిత్ర, శతపత్రమిత్రశశాంకనేత్ర దిగీశమకుటరత్నప్రభా మహితపాద, శరణాగతత్రాణ కరపరాయణభూరికరుణా రసాపాంగ ఖగతురంగ, రక్షితవేదండ రణజయక

రికాండ శయధృతకోదండచక్రకాండ, దేవశ్రీ
కృష్ణభూవరు దేవివైన నీలమణిదేవిఁ గృపతోడ
నేలుమెపుడు మత్స్యపురవాస - ౫౩.

కరిరాజు నేలిన కరుణారసస్ఫూర్తి నెరిఁకు
చేలుని బ్రోచునిపుణతయును, ధ్రువునిమన్నిన
మహిమ్నతదయారసరూఢి పాంచాలిపైనున్న
పరమకరుణ, ప్రహ్లాదుఁ జూచిన భరితకృపాదృ
ష్టిరుక్మాంగదుని నేలు రుచిరదయయు, గుహు
నిఁ మన్నించిన గురువచోమృదురీతి కుబ్జాంగనను
బ్రోచుమూర్తి పెంపు, గలిగిదయఁ జూడుమోర
మాకాంతవరద, దేవశ్రీకృష్ణభూవరు దేవివైన
న నీలమణిదేవిఁ గృపతోడ నేలుమెపుడు మత్స్య
పురవాస - ౫౪.

దశరథుఁడవెడు భూధవునకాత్మజనించిపర
గవిద్యాభ్యాస ప్రౌఢిగాంచి, మునివెంట సవ
నపాలనమున కేతెంచి సీతావివాహ సంసిద్ధి
గాంచి, తమ్ముఁడీమణినిగూడి దండకాటవి బోం
చి పంక్తికంధరు నాజిబడవధించి, భూసుతాను
ణిగూడి పుష్పకారూఢతతిరిగియయోధ్యకే తెం
చి మించి, చెలువముగ రాజ్యపాలన సేయుచు
న్న, దేవశ్రీకృష్ణభూవరు దేవివైన నీలమణిదే

వి(గ్రహతోడ నేలుమెపుడు మత్స్యపురనా- ౫౫.

కరమున శంఖచక్రములు గల్గిన వానియురంబున కౌస్తుభంబొప్పువాని, హారకిరీటకేయూరముల్ గలవాని పద్మసన్నిభముఖంబమరువాని, లలిమించుహారుంబట్టు వలువమైగలవాని కలుములీనెడు కన్నుగవలవాని, కలమృదువాక్యసంగతులు గల్గినవాని భక్తకల్పకమనఁ బరగునిన్ను, నాశ్రయించితికరుణించుమంబుజాక్ష. దేవ శ్రీకృష్ణభూవరుదేవియైన నీలమణిదేవి(గ్రహతోడనేలుమెపుడు వినుతమంగాంగ- ౫౬.

నీలఘనద్యుతి నిరసించుమైవాని దళదరవిందనేత్రములవాని, కర్ణకుండలదీప్తిగండస్థలులవాని పూర్ణకృపారసస్ఫురణవాని, వర్ణనీయమహత్త్వసైఖరిగలవానినిర్ణయరహితుఁడైనెగడువాని, మదనకోటివిలాసమహిమగల్గినవాని మొలకనవ్వులముద్దుమోమువాని, నిన్నువర్ణనజేసెదనిమలాత్మ, దేవ శ్రీకృష్ణభూవరుదేవియైన నీలమణిదేవి(గ్రహతోడ నేలుమెపుడు మత్స్యపురవాస - ౫౭.

దీనదయానిధీదిక్కు నీవనిచాలనమ్మియున్నాననయ్యనళిననేత్ర, భక్తరక్షణకార్య భారనివర్త

హుఁడని వింటినీచరితలు వీనులలర, గోపవ
ధూగోపగోరక్షణార్థివై కొండను గొడుగుగా
గొనిముదమున, వృష్టివారించవేవిశ్వేశనీదివ్య
లీలలనంతముల్ లెక్కఁగలరె, కానఁ గృపతో
డనన్నేలు కమలనాభ, దేవశ్రీకృష్ణభూవరు
దేవియైన నీలమణిదేవిఁ గృపతోడ నేలు మెపుడు
వినుతమంగాంగనాధీశ వెంకటేశ - ౫౮.

సకలలోకశరణ్య గీర్వాణవందితయురగ
రాజశయానగరుడయాన, యుర్వీసునానాథ
యోగిమానసహంసగర్వితగ్రాజ గర్వహ
రణ, పర్వంపుజయజయశర్వాణీసునానామ
దుర్వారతరఘోరపరితాశ, పూర్వామర
వినాశ భూరికృపాధార నిర్వాణనాయక నిగ
మవంద్య, దేవశ్రీకృష్ణభూవరుదేవియైన నీల
మణిదేవిఁ గృపతోడ నేలు మెపుడు మత్స్యపుర
వాస - ౫౯.

కేశవనీదివ్యకీర్తనల్ జిహ్వపై పఠియించు
వాఁడెపో భాగవతుఁడు, నరహరినీదివ్యనామ
ముల్ భక్తితోవినినయాతఁడెగదామనుజవరుఁ
డు, హరిపరమేశనీయాకారమూర్తిను తలఁచి
నవాఁడెపో తాపసుండు, మురదానవారినీము

చ్చటల్ వీనుల విని నయాంతఁ డెగదా విప్రవరుఁ
డు, గాననీభక్తితో సాటిగలదె భువిని, దేవశ్రీ
కృష్ణభూవరు దేవి యైన, నీలమణి దేవిఁ గృపతోడ
నేలు మెపుడు, వినుతమంగాంగ - ౬౦.

పద్మనాభ ముకుంద పాహి జనార్దన నరస
ఖ గోవింద నాగతల్ప, సురపతినుత మహాపురుష
విశ్వేశ్వర జలజలోచన చక్రి శార్ఙ్గహస్త, పీఁ
దరమాధీశ వాసుదేవ శరణ్య రక్షక సర్వజ్ఞ దా
క్షసారి, యని నిను ముదముతో ననిశంబు ధ్యా
నించు నట్టి మహాత్ములకనఘచరిత, నీవు రక్షించు
టబ్రమే నిగమవద్య, దేవశ్రీకృష్ణభూవరు దేవి
యైన, నీలమణి దేవిఁ గృపతోడ నేలు మెపుడు విను
తమంగాంగనాధీశ వెంకటేశ - ౬౧.

మునిమానసాంభోజములకు మిళిందముల్
శ్రుతివధూసీమంత శివకరములు, బలిశిరోలంకా
రవరవిలాసంబులు ముక్తికాంతాలసమ్మోహన
ములు, శ్రీమద్వ్రజాంగనా చిత్తతోషణములు
భక్తజనామోదభాసురములు, దోషభూత వి
తాన దూరీకరంబులు వర్ధితసురరాజ వైభవ
ములు, నగు భవత్పదరజములనాశ్రయింతు, దేవ
శ్రీకృష్ణభూవరు దేవి యైన, నీలమణి దేవిఁ గృపతో

నేలు మెపుడు, డవినుతమాంగాంగ - ౬౨.

పరమదయానిధీ పతితపావననామ యుం
వరశ్యామవిజయధామ, సత్యభామా స్వాత్రి
సమధికతరమూర్తి నిత్యనిర్మలకీర్తి నిర్జితా
రి, కరుణారసాధార నిరుపమానవిహార సక
లలోకాధారసమరవీర, నారదాదిస్తోత్రవారి
జదళనేత్ర మా మానినీవరమంజుగాత్ర, దేవ
శ్రీకృష్ణభూవరు దేవిరైన, నీలమణి దేవిఁగృపతో
డ నేలు మెపుడు, మత్స్యపురవాస - ౬౩.

మురహరవిశ్వేశముక్తిప్రదత్రిలోకపూజిత
పదయుగభోగిశయన, యవనధేనుకబకాసు
లదుష్టనిశాటభంజనకరబాహుబలవిహార,
ధకయదువృష్టిబంధురత్నకళాకిరణచాతుర్య
శ్రీకరశుభాంగ, వాగధినాథునకొగి జన్మభూ
మిరైదనరారుబొడ్డుపొందమ్మిగల్గు, దేవశ్రీకృ
ష్ణభూవరు దేవిరైన నీలమణిదేవిఁ గృపతోడ నే
లు మెపుడు మత్స్యపురవాస - ౬౪.

భూమిసుతాచిత్తతామరసోజ్జ్వల దినకర
రాజన్యదివ్యనవ్య, కోటీరమణివిభాంకురవిరా
జత్పాద పంక్తిరథోజ్జ్వలభాగ్యరాశి, కూరిగన
క్తించర వీరనిర్జితలసన్నాంకార్ముకశరసహా

తహస్త, కౌశికసవనసత్కార్యనిర్వాహకకా
రుణ్యరసనిమ్నగాకళత్ర, దేవ శ్రీకృష్ణభూవరు
దేవిర్మైన,నీలమణిదేవిఁగృపతోడ నేలుమెపుడ
మత్స్యపురవాస - ౬౫.

వరదపరేశ భాసురపుండరీకాక్ష శరణాగత
త్రాణకరణదక్ష, సురుచిరమణిహారసుందరో
జ్జ్వలవక్ష పరమదయాధారభక్తరక్ష, పక్షిరా
జసుయాన భరితకృపాధీన నిజశరీనుతగాన ని
రుపమాన, సనకాదిమునిజాలసన్నుతగుణశీల
దినకరశతకోటిదీప్తి తేజ, దేవశ్రీకృష్ణభూవరు
దేవిర్మైన, నీలమణిదేవిఁగృపతోడ నేలుమెపుడు
మత్స్యపురవాస - ౬౬.

ప్రహ్లాదనారదబలివిభీషణశుకబకదాల్భ్య
శౌనకవ్యాసవిదుర, లంబరీషార్జునులకూ్రర
రైభ్యకుల్ ఖట్వాంగభీష్మాదికరికులేంద్రము, లా
దియాభాగవతాగ్రగణ్యులు తొల్లిభవదీయ స
ద్భక్తిబలిమిగాదె, నిత్యనిమ్నలమహనీయ వి
భూతికి పాత్రులై నెగడిరిభవ్యచరిత, దేవశ్రీ
కృష్ణభూవరుదేవిర్మైన, నీలమణిదేవిఁ గృపతోడ
నేలుమెపుడు, మత్స్యపురవాస - ౬౭.

రఘుకులజలరాశి రాకాసుధాకరుండూర్జి

తబలుఁదాజిసిజిఁతారి, దాసచాతకదైన్య దళితపర్జన్యుండు విపదుగ్రకాననవీతిహోత్రుఁ, డార్యజనానందశౌర్యచాతుర్యుండు శరధిభేదనతీవ్రశరవరుండు, రవిజప్లవగపూజ్యరాజ్యప్రదాయకుండబ్ధిబంధనకళాంచత్ప్రతాపుఁ, డైన నిన్నెన్న నేరికి నలవియగునె, దేవ శ్రీకృష్ణభూవరుదేవియైన, నీలమణిదేవిఁగృపతోడ నేలు మెపుడు వినుతమంగాంగ - ౬౮.

హరిపరమేశ శ్రీకర వరాంతక శౌరి యని నీదు నామంబులను దినంబు, నిశ్చలచిత్తులై నెరి పఠించిన యట్టిపుణ్యశీలురు సదా భూరిమహిమ, శమనలులాయప్రచండఘంటాఘుళంఘుళనినాదములోలికర్ణములను, ఁనకనిష్ఠ ముఁగైసనకాది మౌనీంద్రసంసేవ్యమౌ భవత్సదనవాసులౌ ము రమారేంద్రవందితయౌ దిదేవ, దేవ శ్రీకృష్ణభూవరుదేవియైన, నీలమణిదేవిఁ గృపతోడ నేలు మెపుడు, వినుతమంగాంగ - ౬౯.

కమనీయహరినీలకాంతులనిరసించు కుటిలాలకశ్రేణికోమరుమీర, రాకారుచిరపూర్ణరాజబింబస్ఫూర్తిగలముఖద్యుతులు శ్రీకరమెసంగ, కుసుమకార్ముకభూతికొల్లలాడగ జాలు

భ్రూవిలాసంబతిస్ఫురణదనర, భువన మోహ
నభవద్భూరివిలాసంబు గాంచినట్టిసురాహి క
న్యలైన, మోహమందుందురనగోపముదిత లెం
త, దేవ శ్రీకృష్ణభూవరు దేవిద్వైన, నీలమణి దేవిం
గృపతోడ నేలు మెపుడు, వినుతమంగాంగ- ౭౦.

సయ్యమిహ్యత్కు- శేశయజలజప్రియదివ్య
కోటీరాగ్రనవ్యపద్మ, రాగప్రభాపుంజ రంజిత
పదయుగ భోగిభోగశయాన భూరికలుష, కా
ననపావక ఖగకులాధపయాన భానుకోటిసహ
స్రభాసురాభ, ధేనుకబకపూర్వదేవాద్రిశత
కోటి దీనజనాధారదివ్యభూజ, దేవ శ్రీ కృష్ణ
భూవరు దేవిద్వైన, నీలమణిదేవిఁగృపతోడ నేలు
మెపుడు, మత్స్యపురవాస - ౭౧.

సమరారికులగర్వ శాంతిదభుజశౌర్య క
మలావధూమనఃకింజమిత్ర, యమనియమాస
నాద్యష్టాంగసుధ్యేయ కమనీయమృదులసత్కాం
తిచేల, సుమబాణజనక భాసురపూజితపదాబ్జ
శమనభటాభర్తీ చటులనామ, శ్యామల జీ
మూతకోమలరుచిదేహ కామారినుతసర్వకలు
షహరణ, దేవ శ్రీకృష్ణభూవరు దేవిద్వైన నీల
మణిదేవిఁగృపతోడ నేలు మెపుడుమత్స్య- ౭౨.

సకలచరాచర సంఘ మెవ్వని యాజ్ఞను సృ
ష్టిలయములనొందుచుండు , నీవిశ్వమంతటికి
స్వcడాధారమై భుజశక్తిపోషణం బొనరc జే
యు, నాదిమధ్యాంతంబు లరయ నెవ్వనికి లేవం
తటదానమైయలరు నెవ్వc , డబ్జసంభవసురేం
ద్రాదిదివ్యసమూహ మెవ్వనికరుణచే నేపుగాం
తు, రట్టిమహనీయుదైవమీవనఘచరిత, దేవ శ్రీ
కృష్ణభూవరు దేవిరైన, నీలమణిదేవిc గృపతోడ
నేలు మెపుడు, వినుతమంగాంగ - ౭౩.

ననుకరుణింపు మోనాథనాథ యనాథ భవ
లయకారణభక్తరక్ష , సనకాదిమునినుత సా
ధుజనాధార వనరుహలోచన ధనదమిత్ర,మిత్ర
జగత్ప్రభూ మేరుభూధరధీర సర్వలోకశరణ్య
సదయహృదయ , దానవాంతకచక్రధర పరా
త్పర సదా దీనజనాధారదిక్కు నీవ , దేవ శ్రీ
కృష్ణభూవరు దేవిరైన, నీలమణిదేవిc గృపతోడ
నేలు మెపుడు మత్స్యపురవాస - ౭౪.

కరుణించుమాశ్రితకామితమందారకరుణిం
చు ఘనసమానకాంతిచేల , కరుణించు మఘనా
శకరసురార్చితపద కరుణించుమంగళాకరశు
భాంగ, కరుణించుముసుకుమారాంగ కామకోటివిలాస

కరుణించు భక్తార్తిహరణశీల, కరుణించు చాణూరగర్వభంజనకర కరుణించులోకేశ కమల నాభ, దేవశ్రీకృష్ణభూవరు దేవియైన, నీలమణి దేవిఁగృపతోడ నేలు మెపుడు, మత్స్యపుర - ౭౫.

ముదమెదఁగదుర నీపదములుభక్తితోఁ బూజించువాఁడెపో పుణ్యతముఁడు, మదినదినీనామమంత్రంబుజిహ్వపై పఠియించువాఁడెపో భాగవతుఁడు, వీనులభవదీయ విపులగుణౌఘముల్ వినువాఁడెసర్వదా వినుతయశుఁడు, నియమంబుతోఁసదా నీమందిరమునకై నడచినవాఁడెపోనరనుతుండు, దేవ శ్రీకృష్ణభూవరు దేవియైన, నీలమణిదేవిఁగృపతోడ నేలు మెపుడు, మత్స్యపురవాస - ౭౬.

మునుమురాయనునట్టి మొరకునిరాబారి కన్నాకుజేసితివన్నెమీర, అబ్దపంచవయస్కుఁడౌత్తానపాదునకగ్రపదస్థితినలరజేసి, సబలస్వచక్రిపైనమితదయాస్ఫూర్తిచేడెలమేల్బంతి జేసినావు, భక్తితోనెంగిలిఫలములొసంగిన భుజియించిచెలిదయఁబ్రోచినావు, భక్తజనలోకరక్షణపారిజాత, దేవశ్రీకృష్ణభూవరు దేవియైన, నీలమణిదేవిఁగృపతోడ నేలు మెపుడు, వినుత - ౭౭.

అబ్జభవాదిదేవౌఘు మెవ్వనిలసత్కరుణ స్వలోకాధికారులైరి, సకలచరాచరసంఘం బునకు నెవ్వడంతరాత్మకుడననతిశయిల్లు, నయ్యా మిహ్యాతుక శేశయకర్ణికలయందువిహరించు నెవ్వఁడు విపులమహిమ , నీవిశ్వమంతటికి వ్వఁడాధారమై వెలిలోనదానయ్యె వెలయుచుం డు, నట్టికరుణాకరునినిన్ను నాశ్రయింతు , దేవ శ్రీకృష్ణభూవరు దేవియైన,నీలమణిదేవిఁగృపతో డ నేలు మెపుడు , వినుతముంగాంగ-౭౮.

దేవజగన్నాథదినకరశతకోటి తేజదయాని ధిదీనరక్ష , సేవకసేవధిసితకరరవి నేత్ర శ్రీవ త్సలాంఛనాంచితచరిత్ర , యవనధేనుకమురా ద్యఖిలదుష్టనిశాటభంజనజగదీశ భయవినాశ, జనకాత్మజాధవకనకాద్రిసమధీర సనకాదిముని మనస్సదనవాస , దేవ శ్రీకృష్ణభూవరు దేవి యైన, నీలమణిదేవిఁగృపతోడ నేలుమెపుడు,మ త్స్యపురవాస - ౭౯.

నీలఘనమ్యుతినిరసించుకచపంక్తి శిఖిపింఛ మునవింతచెలువొనర్ప , రాకాబ్జబింబంబు ర హించుమోముపై మొలకనవ్వులదీప్తి ముద్దు గులుక , కరితుండములనీటుగలమేటిబాహులు

కనకాంగదముల చేఘనతమీరం, కష్ణారాజితనిగ్గు గనినవ్వ్య మైడాలుపట్టు చేలపు వింతపసనేసంగ దనరు నీసోయగం బెన్నదరముటన్న, దేవకీశ్రీకృష్ణభూవరు దేవిధైన, నీలమణి దేవిం గృపతోడ నేలు మెపుడు మత్స్యపురవాస - ౮౦.

పుట్టినమూడవనాడు పొత్తులకుట్టుంబడై విసపు పాలిచ్చిన వెలదిజంపి, శకటదైత్యునిగూల చరణాగ్రమునదన్ని జననినానందాబ్ధిమునుగంజేసి, వల్లవరాకాబ్జ వదనలిళ్లనుగల నవనీతఘృతముల చవులెటింగి, త్వన్ముఖాబ్జమరీచితతులచే గోపికా దృక్చకోరములకుం దృప్తొనొసంగు, దేవకీశ్రీకృష్ణభూవరు దేవిధైన, నీలమణి దేవిం గృపతోడ నేలు మెడు, మత్స్యపురవాస- ౮౧.

వందన మోరమావరపురందరనుత వందనం బకలంకసుందరాంగ, వందనం బాశ్రితవరదదయాధార వందనం బంబికావరసుమిత్ర, వందనం బమరారివరజయభుజబల వందనం బర్యమవామనయన, వందనం బురగరాడ్వరసుతలోప్పజ్వలవందనం బరవిందసుందరపద, దేవకీశ్రీకృష్ణభూవరు దేవిధైన, నీలమణి దేవిం గృపతోడ నేలు మెపుడు, మత్స్యపురవాస - ౮౨.

భక్తవిపత్తమఃపటలనభోమణి దాసమ
యారసంతర్పితఘన, దీనజనాభీష్ట దానచిం
తామణిసయ్యమిమానససదనహంస, యాచ
కజనదైన్యహరణకల్పద్రుమకలుషకాననహుతో
త్కటకుఠార, కమలావధూనేత్ర కైరవసితక
ర సమరనిర్జితరిపుచక్రపాణి, దేవ శ్రీకృష్ణ
భూవరు దేవిర్మైన, నీలమణిదేవి గృపతో నేలు
మెపుడు, మత్స్యపురవాస - ౭౩.

స్మరశతకోటిభాసురసుందరవిలాస వాస
వశతకోటివైభవాఢ్య, భాస్కరశతకోటి భ
వ్యతేజోజ్జ్వల నీరదశతకోటినిర్మలాంభ, నారద
శతకోటినవ్యగానవినోదవాసుకిశతకోటి వర్ణ్య
సుగుణ, శతధృతిశతకోటి జన్మహేతువినోద
మౌనీంద్రశతకోటిమాన్యచరిత, దేవ శ్రీకృష్ణ
కృష్ణభూవరు దేవిర్మైన, నీలమణిదేవిఁ గృపతోడ
నేలు మెపుడు, మత్స్యపురవాస - ౭౪.

కరుణారసంబొలుకుకనుదామరలవానికర
ముప్పశంఖచక్రములవాని, ఇందీవరచ్ఛాయ
నెనయుమై జిగివాని కోరినగుమోము గో
మువాని, పద్మరాగోజ్జ్వల ప్రభకిరీటమువాని
కమనీయగండభాగములవాని, శ్రీకాంవిలసన

శ్రీకర్ణములవాని కమలాస్త్రినగుసోయగంబు వాని, నిన్నుధ్యానించి మ్రొక్కెద నీరజాక్ష, దేవశ్రీకృష్ణభూవరు దేవియైన,నీలవణిదేవిఁ గృపతోడ నేలుమెపుడు,వినుతమంగాంగ - ౮౫.

కృష్ణమాధవహరి కేశవగోవిందవనమాలినగ ధరవాసుదేవ యుక్రూరవరదయో చక్రపాణిము కుంద గరుడధ్వజమురారికంజనయన, పగము దయానిధీ పద్మనాభసురేంద్ర వందితముచకుం ద వరదయీశ, భక్తరక్షక రమాపతిబకాంత క శౌరికరుణాకరపరేశఘనదయాబ్ధి, దేవశ్రీ కృష్ణభూవరు దేవియైన, నీలమణిదేవిఁగృపతోడ నేలుమెపుడు, మత్స్యపురవాస - ౮౬.

హరియనునీదునామాక్షరయుగ్మంబు సద్భ క్తిపఠియించుసజ్జనులకు, సర్వమనోభీష్ట సం సిద్ధికరమునై దురితజీమూతసందోహమునకు, జంఝూసమీరమై శాశ్వతానందమై మానీం ద్రసంసేవ్యమానమగుచు, నిరుపమానోన్నతి నిష్కళంకంబునై యిహపరసౌఖ్యంబు నెల మినాసఁగు, గలదెసరిబోల్పనీనామ మునకు భువిని, దేవశ్రీకృష్ణభూవరు దేవియైన,నీలమణి దేవిఁగృపతోడ నేలుమెపుడు, వినుత - ౮౭.

ఇందిరాహృదయేశ మంధరగిరిధరకంధిగ
ర్వవినాశ కామకోటి, సుందరసుకుమార కుం
దేందుఘనసార మందారశరదభ్ర చందనశర.
హారహీరతుషార శారదడిండీర పారదనారద
భాసురయశ, ధేనుకబకముర దానవాంతక
ఘోరభవభయనాశనభక్తవరద, దేవ శ్రీకృ
ష్ణభూవరుదేవిద్మైన, నీలమణిదేవింగృపతోడ నే
లుమెపుడు, మత్స్యపురవాస - ౮౮.

ఎవ్వఁడు మకటమి నింద్రాదులజయించి స
త్యభామకు పారిజాతమిచ్చె, నెవ్వఁడు సుర
మానినింతనిగాఁ జేసి కర్ణంబుబోద్రోచి ఘనుని
జేసె, నెవ్వఁడురిక్తత నేపారుభూసురు సా
మ్రాజ్యమునొసంగి సఖుని జేసె, నెవ్వఁడు మ
హిమ చేనివ్వటిల్లెడు ప్రజ్ఞ సతిగోరమృతవిప్ర సు
తులనొసఁగె, నట్టిదేవరవని నిన్నునాశ్రయింతు,
దేవ శ్రీకృష్ణభూవరుదేవిద్మైన, నీలమణిదేవింగృ
పతోడ నేలుమెపుడు, వినుతమంగాంగ - ౮౯.

హలకులిశాంకుశజలజరేఖలకునివాసముల్
దృఢరాగభాసురములు - సేవకజన జన్మపావన
కరములు భక్తమనఃపద్మబంభరములు - నిఃని
మలపవిత్ర నీరధారా సిక్త పావనరుగ్ధాః భూ

సుగములు - వేదాంతభామినీ విపులఫాలతటా గ్రసిందూరికాకజశ్రీకరములు - నైన భవదీయ పదములనాశ్రయింతు- దేవ శ్రీకృష్ణభూవరుదేవిదైన, నీలమణిదేవిఁగృపతోడ నేలు మెపుడు, వినుతమంగాంగనాధీశ వెంకటేశ - ౯౦.

వాసుదేవ త్రిలోకవందితజగదీశ దాసమానోభీష్టదప్రసన్న - వాసవాదిదిగీశ వరమకుటోజ్జ్వలరత్నప్రభాపుంజరంజితపద - ఘోరమాంగనానేత్రకుముదసుధాకరదోష శుష్కారణ్యధూమయోని, శేషపన్నగతల్ప భాషాధిపస్తుత శ్రీవత్సకౌస్తుభాంచితసువక్ష, దేవ శ్రీకృష్ణభూవరుదేవిదైన, నీలమణిదేవిఁగృపతోడ నేలుమెపుడు, మత్స్యపురవాస - ౯౧.

రాధాధరోష్ఠంబు రమణబింబమటంచు దరినున్నచిలుకను తఘుకుగానబు, మగరాలజిగి మించుమండనంబునబిల్చి తత్సరిసరహాస తలని నొంప,పొలయల్లచేమోడిబూనినసతిగాంచికలమ్మృదుభాషలగారవించి, ఘురితసుద్దమునాడి చుంబనంబులదేల్చి మితిలేనిరతులచే మెప్పొసర్చు, దేవ శ్రీకృష్ణభూవరుదేవిదైన, నీలమణిదేవిఁగృపతోడ నేలుమెపుడు, మత్స్యపు- ౯౨.

శౌరిజనార్దన చక్రపాణిముకుంద మాధవగోవిందమదనజనక, వాసుదేవాచ్యుత వరద రమాధీశ శేషపన్నగతల్ప శ్రీనివాస, కరుణించులోకేశమురనరకాంతక పరమదయానిధీ భక్తసులభ, హరిపురుషోత్తమ యబ్జనాభసహస్ర లోచననీలాభ్రరుచిరదేహ, దేవ శ్రీకృష్ణభూవరుదేవివైన, నీలమణిదేవిఁగృపతోడ నేలుమెపుడు, మత్స్యపురవాస - ౯౩.

పాలవారాశిలోపలభోగిశయ్యపై యోగనిద్రవహించియున్నయట్టి, భవదీయమగునాభిపద్మంబులోనాల్గుమొగములుగలబాలుఁడొకడుబుట్టి, తనజన్మమునకు నాధారమై వెలసినపద్మనాళము వెంటబహుసహస్ర, సంఖ్యగల్గినకాలసరణినారసినినుగనజాలడటయొరులనఁగనెంత, నీదుకరుణ యాధారమీనిఖిలమునకు, దేవశ్రీకృష్ణభూవరుదేవివైన, నీలమణిదేవిఁగృపతోడనేలుమెపుడు, వినుత - ౯౪.

సత్యాంగనకు పూలసరములుజడజుట్టిజాంబవతికిగంధసారమలది, భోజకన్యకకు కప్పురపువీడెమొసంగి భద్రకుకాశ్మీరపత్రములిడి, లక్ష్మణాంగనకుహారములుదిక్కులుదీర్చి రవిజకు

నైపథ్యరచన నెరపి, మిత్రవిందకు దిద్దిమృగమద *తిలుకంబు వరసుదంతకు నెరుల్ దురు మొనర్చి, సతులగయిచేసితమిదీరరతులొనర్చు, దేవ శ్రీకృష్ణభూవరు దేవివైన, నీలమణిదేవి కృపతోడ నేలు మెపుడు, వినుతవెంగాంక - ౯౫.

శ్రీకృష్ణమాధవ శ్రీరమాపతియని భక్తిలేకైనను భక్తినైన, సుతు పేరనైనను కుతుకముతోనైన చిలుకను బెంచైన చెలిమినైన, నొగిఁబిదు నామంబు నుడివినమానేత్ర దుర్వారతరమహాదోషరాశులలను దూదితిట్ట, కగ్నివైభస్మంబు సేయకుండు నెముని సేవ్యపాద, దేవ శ్రీకృష్ణభూవరు దేవివైన, నీలమణిదేవి కృపతోడ నేలు మెపుడు, మత్స్యపురవాస - ౯౬.

విలసితయామునవీచీపరంపరోద్గతబిందుసందోహయుతమునగుచు, తత్తీరభూజసంతానపుష్పవితాన సౌరభోజ్జ్వల లసత్సారమగుచు, మానితమాధవీమల్లీమతల్లికావల్లీవలయవీథివ్రాలివ్రాలి, వెలయు తెమ్మెరలుపైవీవ బృందారణ్యవీథిగోపాంగనావితతిగూడి, గొనబుక్రీడ మొనపఁ వేజనశరణ్య, దేవ శ్రీకృష్ణభూవరు దేవివైన, నీలమణిదేవి కృపతోడ నేలు మెపు

డ:, వినుతమంగాంగనాధీశ వెంకటేశ - ౯౭.

సనకసనందన మునిమానసాంభోజ బంభ రసమురనిభఁయవిహార , శరణాగతాభయజ నపరక్షణదక్ష కరుణారసోజ్జ్వల ఘనకటాక్ష, శంఖ చక్ర గదాసి శార్ఙ్గ పంచాయుధ యుతదో ర్విలాసముజ్జ్వలాంగ, ఖరదూషణాదిమ్లే చ్ఛ రపన్నగ ఖగేంద్రవరదరమాధవవాసుదేవ, దేవ శ్రీకృష్ణభూవరుదేవిప్రియైన,నీలమణిదేవిఁగృపతో డనేలుమెపుడు , మత్స్యపురవాస - ౯౮.

శ్రీపతివిశ్వేశ గోపికాహృదయేశ మాధవ గోవింద మధువిరోధి - కృష్ణహృషీకేశ కేశవ గోవిందవరదపరేశవైకుంఠవాసవనుత- భక్తకల్ప ద్రుమభవరోగభయదూర మూర్తిత్రయి సమే తమురవిభేది - కంజనేత్రహిరణ్యకశ్యపాంతక శౌరి దాసమనోభీష్టదప్రసన్న - దేవ శ్రీకృష్ణ భూవరుదేవిప్రియైన - నీలమణిదేవిఁగృపతోడ నే లుమెపుడు - మత్స్యపురవాస - ౯౯.

సీసమాలిక. శ్రీసదాశివ చంద్రశేఖర వర మేశ భీమమహాదేవ సోమభర్గ - విశ్వనాథ త్రినేత్ర వీరభద్రమహేశ శంకరహరభవశరణ యీశ - మృత్యుంజయామృడమిత్రాగపతి వి

పాశ కలుషనాశన మహాకాళవరద - కైలాస
మందిర కాలకూటాశన కాలకాల స్థాణు ఖండప
రశు - వామదేవ కురంగపాణి ధూర్జటి నీలలో
హిత సర్వజ్ఞ రుద్ర శూలి - యుగ్ర విరూపాక్ష
వ్యోమకేశ కృశాను రేత యీశాన గౌరీకళత్ర -
కాలకంఠ పురారి ఫాలలోచన శివ భూతనాథ స్మ
రారి భుజగభూష - దక్షమఖాంతక ధనదమిత్ర
పరేశ కృత్తివాస పినాకి గిరిశయ భవ - పశుప
తి ప్రమథేశ పార్వతీనాథ శ్రీకంఠ గజాసుర గర్వ
హరణ - యంధకరిపు భక్తసందోహపాలక యిం
దరేశ ప్రియసుందరాంగ - శంభో మహాదేవ స
ర్వేశ్వర కపర్ది సాంబ గంగాధర సదయహృద
య - దేవ శ్రీకృష్ణభూవరు దేవియైన, నీలమణి
దేవిఁ గృపతో డనేలు మెప్పుడు - మత్స్యపురవాస
శతకోటి స్మరవిలాస - సామజాసురమదభంగ
భీమలింగ - ౧౦౦.

సరవినందాపురవరకులజలరాశి విధుఁడు వీ
రపురాజు విమలయశుఁడు - శివపదరాజీవచిం
తనాభ్యాసుండు సర్వశాస్త్రార్థ విశారదుం
డు - నతనికి సుతుఁడను నార్యవిధేయుఁడ రా
మచంద్ర నృపాఖ్యఁ బేనెసఁగు - వాఁడను

దువచోవర్ణన నీసీసశతక మిచ్చెద గొమ్ముశ్యా
మలాంగ - దేవశ్రీకృష్ణభూవరు దేవిదైన-నీల
మణిదేవిగృపతోడ నేలుమెపుడు - మత్స్యపుర
సవిశ్వేశ మంజుభాష వినుతమంగాంగనాధీశ
వెంకటేశ - ౧౦౧. * *

శ్రీ సీతారామార్పణమస్తు.

శ్రీ ఉమామహేశ్వరార్పణమస్తు.

శ్రీ శివార్పణమస్తు.



